# కొండవీటి విజయము

కావ్యతీర్థ, బంకుపల్లి మల్లయ్యశాస్త్రి.






శ్రీకృష్ణా బుక్ డిపో
రాజమండ్రి

# పుత్రోత్పత్తి వైరాగ్యము.

రాజన్ ముద్రాక్షరశాల,

రాజమండ్రి.

# రెండు మాటలు

"వాక్యం రసాత్మకం కావ్యం" అనుటవల్ల రసయుక్తమైన దొక్క వాక్యమును గావ్యమనఁ జెల్లును. కాని కొన్ని వర్ణనలు కావ్యమున నుండక తీరదని కొందఱు లాక్షణికులు వ్రాసినందున నీ గ్రంథము నన్నియు లేనందున మేఘసందేశము వంటి ఖండకావ్య మనవచ్చును. ప్రాచీనకవుల ప్రబంధములు గ్రంథవిస్తరములును, వర్ణనలలో మునిఁగి తేలుచుఁ గథాస్వరూపము మఱల నొకసారిఁ జదివినఁగాని బుద్ధి కెక్కనందునను ఒక గంటకాలములోఁ జదివి గ్రహించు దగియుండ వలెననియుఁ బురాణగాథ కాకుండ దేశచరిత్ర కథాంశమయి యుండవలెననియు, విద్యార్థులకు బోధనీయమయిన మఱికొన్ని యితర విషయములుకూడ నుండవలెననియు, ప్రారంభము నాటకశైలిగా నుండవలెననియు నెంచి యిది వ్రాసితిని. దీనికి ధీరోదాత్తనాయకుడు కృష్ణదేవరాయలుగా నుంచి ఆయన ధీరోదాత్తత నా నేర్చినంతఁ జూపితిని. ఈ కావ్యము వ్రాసి పదునేను సంవత్సరములకు తక్కువకాల మయి యుండదు. నా మనసులో నున్నంతయు నిందుఁ జూపలేకున్నను నిట్టితీరు గ్రంథములు గూడ నాంధ్రభాషావధూటి కలంకారములు గాఁగలవని నా నమ్మకము. దీనిని బ్రచురించుమని ప్రోత్సహించి షా

చ్చరించిన నామిత్రులకును దీని కుపోద్ఘాతమును వ్రాసిన
శ్రీయుత గిడుగు సీతాపతిరావు గారికిని దీనిని బ్రకటింప సమకట్టి
న నారాయణరావు సోదరులకును, ఆయురారోగ్య వృద్ధిగా నా
యాశీర్వాదము లిచ్చి యీ నా కావ్యమును ప్రస్తుత విద్యార్థి
లోకము చదువునట్లు చేయింప టెక్స్టుబుక్కు కమిటీవారిని
బ్రార్థించు చున్నాను.

గ్రంథకర్త.
మల్లయ్యశాస్త్రి

# పరిచయము*

ఇది యొక చక్కని ఖండకావ్యము. దీనిలో ప్రాచీన ప్రబంధముల పోకడలు, నవీన కవిత్వపు పోకడలు రెండున్ను ఇంద్రధనుస్సులోని రంగులవలె రమ్యముగా అమరి యున్నవి. కథావిషయమునకు అనుకూలమైన రసము లన్నీ సందర్భోచిత ముగా సమకూర్చి నాటకాదులలో వలె పాత్రపోషణము గావించి, రసమునకున్ను పాత్రలకున్ను ఉచితమైన భాష ప్రయో గించి రచించిన యీ ఖండకావ్యము చదువరులకు రుచించునని నా నమ్మకము.

ఈ కావ్యమందలి సొగసులు నేను విశేషించి చెప్ప నక్కరలేదు. అవి చదువరులు ఒకసారి గ్రంథము సాంతముగా పరిశీలించినంతనే తెలిసికోగలరు. అంతేకాక, " తినబోవు దాని రుచి అడుగనక్కరలేదు; చెప్పనక్కరలేదు. అయితే, ఇప్పుడు దినమునకొక కావ్యముగా గ్రంథములు వెల్వడుచుండుట చేత అన్నీ చదువుటకు ఎవరికైనా వ్యవధి ఉండదు గనుకను, ఏవి చదువ దగినవో ఏవికావో పేరు చూచి తెలిసికొనుట కష్టము గనుకను సూచనగా కొన్ని విషయములు ఈ గ్రంథమునకు సంబంధించినవి చెప్పవలసి యున్నది.

ఈ చిన్నకావ్యమును రచించినవారు బ్రహ్మశ్రీ బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు; కావ్యతీర్థ బిరుదాంకితులు; పర్లాకిమిడి రాజావారి కాలేజిలో ఆంధ్రగీర్వాణపండితులుగా

సుమారు 29 సంవత్సరములు పనిచేసి ఉపాధ్యాయులలో గట్టి వారని పేరు పొందినవారు; వ్యాకరణ శాస్త్రము భాష్యాంతము అభ్యసించి సంస్కృత విద్యార్థులకు పాఠము చెప్పినవారు; ధర్మశాస్త్రములు ఆమూలాగ్రము విశాలహృదయముతో పరిశీలించి, తప్పుత్రోవను బడియున్న వారికి ప్రబోధము గావించి మంచిమార్గమున ప్రవేశపెట్ట దలచినవారు; శాస్త్రసమ్మతముగానే సంఘసంస్కరణము చేయదలచి మార్గదర్శకులుగా ప్రవర్తించినవారు. భగవత్ కటాక్షమున శ్రావ్యమైన కంఠము గల వారగుట వల్ల పురాణపఠనము నవీనహరికథా కాలక్షేపమువలె చేయు సామర్థ్యము గలవారు.

ఇట్టి వారికి కవిత్వముసైతము అలవడి యుండుట గొప్పవిశేషము. కళలయందున్ను శాస్త్రములయందున్ను ఆరితేరిన వారు రచించిన కావ్యము శ్రావ్యముగాను మనోహరముగాను ఉండక తప్పదని గ్రంథము చదువకమునుపే తోచక మానదు. నాకు అట్లేతోచినది. గ్రంథము పరిశీలించిన తర్వాత నాకుతోచిన అభిప్రాయము మారలేదు. సరిగదా, మరింత దృఢపడినది.

శాస్త్రిగారు సకలశాస్త్రవిశారదులు గనుక, తమ శాస్త్రపరిజ్ఞానము రసపోషణకు అనుకూలముగానే ప్రకటించినారు. "మ. ద్విషదస్థంకరణప్రతాపుఁ డగుచుఁ" అనే

పద్యములోను, "కం. వీఁడు ప్రీతి ప్రసవ మయోఁ" అనేపద్య ములోను తమ వ్యాకరణ శాస్త్ర పరిజ్ఞానమున్ను, "కం. తన పక్షం బిటు చెడిపోయిన" అనే పద్యములో తమకు గల తర్క శాస్త్ర పరిచయమున్ను "చ. ఖగములు గోలుపోయె" మొద లయిన పద్యములలో జ్యోతిష పరిజ్ఞానమున్ను హృద్యముగా ప్రకటించినారు. "చ. అరులు తలెత్తకుండ" మొదలయిన పద్యములలో ఏకకాలమందు జరిగిన రెండు భిన్న విషయములు సరిపోల్చి పదశ్లేషవల్ల ద్వ్యర్థి కావ్యరీతిని మనోహరముగా వర్ణించినారు. "చ. పరువులు తీసికొం చెగసిపా టది మేలె?" అనే పద్యములో పదశ్లేషవల్ల కలిగిన ధ్వని ఏనుగులకు స్వభావసిద్ధ మైన మందగమన మనెడు కొరత ప్రశంసార్హముగా మార్చినది. "క. విధిదాట నెవరిశక్యము" మొదలుకొని "ఉ. దవ్వయె చేవయాను" వరకునుగల నాలుగు పద్యములు పౌరుషహీన మైన విధిన్యాయమును బోధించెడు వాక్యములే అయినా సందర్భోచితములుగా ఉన్నవి.

శైలి, సంగీత సాహిత్యముల రెంటియందును ప్రవీణు లయిన శాస్త్రిగారి కవిత్వమునం దుండవలసిన విధమున మధు రసభరితమై ఉన్నదనుటకు సందేహము లేదు. ప్రాచీన భాషా సంప్రదాయము మాత్రమే ఆధారముగా ఉన్న వ్యాకరణ సూత్రములు శాస్త్రిగారిని పూర్తిగా బంధించలేదు. "ఉ. దవ్వ యె చేవయాను" అనే పద్యములో "ఇవ్వవు" అనే ప్రయో

గము కేవలగ్రామ్యమని కొందరు అనుకోవచ్చును. కాని, అది అప్పకవి కాలమునుండిన్ని సద్వ్యవహారమునందు సభ్యమైన ప్రయోగము గనుక సాధువే అనక తప్పదు. "తెరువరి, తలవరి యెవ్వరు నివ్వరు నవ్వరనఁగ" (అప్ప. II. 196.) లో అప్పకవి 'ఇవ్వరు' (అనగా దాన మివ్వరు' చూ. పద్యము తర్వాతి పట్టిక) అని ప్రయోగించినాడు. రేఫాక్షర సీసమాలికలో రేఫాక్షరము గల పదములు రేఫమునకు పూర్వమందు గల అక్షరము ననుసరించి అకారాదిగా పేర్కొని ఉంచుట వల్ల 'ఇవ్వరు' అనే ప్రయోగము 'ఈయరు' 'ఈరు' అని మార్చి సమర్థించుట వృథా ప్రయాసము.

ఈ చిన్న కావ్యము ఉన్నత శ్రేణిలో ఉండు విద్యార్థులకు పాఠ్యగ్రంథముగా నియమింప దగినదని నా నమ్మకము. ఈ గ్రంథము రచించిన శాస్త్రిగారు తగిన ప్రోత్సాహ మున్న యెడల ఇంకా ఇట్టి గ్రంథములు ఇంతకంటెను ఎక్కువ హృద్యమైనవి రచించి ఆంధ్రదేశమునకు ఎక్కువసేవ చేయగలవారు కాగలరని నా నమ్మకము. భగవంతుఁడు ఈ శాస్త్రిగారికి ఆయు రారోగ్యములు కలిగించి, వీరు దేశమునకున్ను, భాషకున్ను చేయగల సేవ సార్థక మగునట్లు అనుగ్రహించును గాక!

5—5—31 గిడుగు వెంకటసీతాపతి బి. ఎ. ఎల్. టి.

పర్లాకిమిడి చరిత్రాధ్యాపకులు.

శ్రీమాత్రేనమః

సిద్ధియు బుద్ధి పార్శ్వములఁ జేరి తనుం గొలువంగ వేదముల్
వద్దనుజేరు మానులకుఁ బాఠము సెప్పుచు వ్యాసుగ్రంథముల్
దద్దయు వ్రాసికొంచుఁ దనతల్లియొసంగిన మోదుకమ్ము లే
ప్రొద్దు భుజించు నా నగజముద్దులపట్టి నుతింతు ముందుగా.

శ్రీవరుని న్సదాశివవిరించులఁ దాను సృజించి వారికిన్
బ్రోవఁగ సంహరింప జగముల్ సృజియింపఁగ శక్తు లిచ్చి కా
ళీవరలక్ష్మిశారదలలీల ధరించి నవార్ణమంత్రసం
భావిత యైన దుర్గఁగృతి భవ్యముఁజేయ నుతింతుముందుగా

కథాప్రారంభము.

అప్పా! మ్రొక్కులుగొమ్ము నాఁ డుదయదుర్గాధీశు నోడించితిన్
డెప్పై నీవు రణాంబుధి న్నిలువఁగా నేఁడున్ జయం బందితిన్
ముప్పుల్ నేనిటు లెన్నియో కడచితిన్ మున్నీకృపం గ్రొత్తగాఁ
జెప్పంగావలెనే? శిశుత్వమున నీచేఁ బ్రాణము ల్నిల్చెఁగా

మును నే జవ్వనపు న్మదంబుకలిమి న్మన్నెన్కలం గాంచకే
చన మూహించితి శత్రుల న్గెలువఁగా సర్వజ్ఞ! న న్నిల్పి చ
క్కనిసేన ల్సమకూర్చి యిచ్చితి వటు ల్గాకున్న నీవీరభ
ద్రుని మాకోర్కెఁగను దక్షుఁడౌదు నెటు? వీరు న్నేఁటనిప్పట్టునన్

కొండవీటివిజయము.

ముం దెఱుఁగక నిను నే నప
నిందల పాల్సేయ నదియు నృపశుల దుర్వా
క్సందర్భమున నని తలఁతు
డెందమునను గరుణ యెంతటిదియో నాపై

నా విని నవ్వి తిమ్మరుసు నాయన! నీ వసహాయశూరతన్
గావలి గోరుదే? సచివకార్యము దీర్చుట కట్లొనర్చితిన్
భూవర! తొల్లి యాయుశుత్థ భూమిసుతాధవుఁ డబ్ధిఁ గట్టఁగా
సేవ యొనర్పదే కొఱఁతఁ జెందునె ధీరుల కార్యజాతముల్

కవు లెనమంత్రము జాతి కొక కావ్యము నొక్కఁడనల్ల నొక్కఁడో
చెవులకుఁ బానకంబుగ రుచించు సుగానము పల్లవింపఁ బ
ల్లవులఁ గఱచుచు న్లలితలాస్యము వేశ్యలొనర్ప నొంటుచోఁ
బవలును రే ల్వినోదములపై మది నిల్పిన రాజ్య ముండునే

అరిబలవిక్రమం బధికమైన తఱి న్విరమించి ధీరుఁడై
యుర వొనరించి స్వీయబల, ముద్ధతుఁడై పరునోర్వఁగా వలెన్
వెరవరి యైన ధర్మజుఁడు వెన్బడఁడే పదుమూఁడు వత్సరా
ల్విరివి యొనర్పఁగా బలము; వీరవరా! మది గుర్తెఱుంగుమా

భేదము దానము న్నొరప భిక్షుకవేషము వైచియేని దు
ర్భేదతరాంగభంగ మొనరింపఁ దగు న్పరరాష్ట్రసీమలన్
మోదము ఖేదము న్సమతఁ బూనఁ దగు న్మది; కృష్ణపార్థసం
వాదము నీయెఱుంగనిదె! భారతయోధవు కావె నీ విలన్

నా రహిఁ బల్కె రాయలు ఘనంబగు నీదయగాదె ప్రోచె నా
వీరనృసింహరాయఁ డటవీస్థలి న న్నిటు లంతగాఁగఁ దా
నారటపెట్టునాఁడు సవతమ్మ విసం బిడునాఁడు నాఁడె యీ
వీరుని సైన్య మేమి దలపెట్ట కెదిర్చెడునాఁడు నేఁడునున్

నీనయకౌశలంపుతరణిన్ సివసంద్రము దాటనే? తొలిన్
నీనయకౌశలం బను వనిం బడి చిక్కఁడె చిక్కరాయఁడున్
నీనయకౌశలం బను ఫణి న్గఱిపింపవె పాలెగాండ్ర న
ప్పా! నను గన్ను ఱెప్పవలెఁ బాయక ప్రోచెదు నీ నయంబె కా

చె మరుపలేదు గా నొసటిచెందిరము న్మళయాళపాండ్య దే
శములు జయించునప్పుడు; భుజంబున నావలెవా టొకింతయున్
దెమలుపఁ జాలిరే ద్రావిడదేశపుమేల్సరదార్లు! కన్నడం
బు మద మడంగెఁ గాఁ గవచముం బలె నీనయమే వహించుటన్

దృఢతరదేహుఁ డయ్యు నిల దేహపరిశ్రమఁ జేయ కున్న నా
దృఢతయు నిల్చునే? తనకు దేశముగల్గియు నీతివల్లరుల్
దృఢ మయి ప్రాకఁగా నితరదేశపుఁబ్రాకులు ద్రాఁపఁడే న్పరీ
వృథునకు డక్కునే స్వమహి; తృప్తి వహించుట రాజధర్మమే?

అన విని రాయలు మంత్రిం
గని యిం కిపు డేమి సేయఁగాఁ బంచెద వీ
వన నగి నీ వెఱుఁగవె యై
నను నాయెడ గౌరవంబునను బల్కితిగా

ఇఁకఁ గొండవీటిదుర్గము
నకు వేగమె సేవ లన్ని నడిపింపుము దా
నికి సరిదుర్గము లితరము
లిఁక హిందూదేశమున మ ఱెవ్వియుఁ గలవే?

శుంభదవార్యవీర్యదము శూరతకు న్నెల వంచు నెంచి యా
రంభ మొనర్చెఁ గోట కమరావతిమ న్ననఁ బద్దె బ్రాలమ్ముగ్
గుంభిని నెంచి యాష్టరణకోటను ద్రవ్యనమంటితోడ వి
శ్వంభరరాజు పూర్ణముగ సాలము పెంచెను గొండవీడునన్

కలిగెను గొంతపేరు తొలి కాటయవేమనరెడ్డినాఁటికిన్
య్యలఘునికావ్యముం జదివి. యప్పుడు శ్రీపతిరెడ్డి నీరుకున్ న
వ్వల, ననవేమమంత్రి యుగ్గు భాస్కరుచేతను హెచ్చెఁ దివ్యమై
యిల నలసూరమాంబకయు యాపాటలు కొండనసాగరంబునన్
పెట్టనికోట యై గిరులు పేర్చెను చుట్టు మహోన్నతంబుగా
బట్టుగ రాజులం గెలిచి సాఁగెను వీరుఁడు వీరభద్రుఁడా
మెట్టను దాఁగియుండ; నిట మీఁదట నాతని బట్టఁ గట్టగా
ముట్టఁడి సేసి పొట్టయిన ముక్కల నందుట కార్యమిత్తఱిన్

అన విని రాయఁడు

ఎవ్వ రెవ్వరిఁ గొంపఁ దాఁ జేఁగినాఁడో
కొండవీఁటికి వీరభద్రుండు; మనము
గొండదండుగ మాత్రమె కొంచుఁబోయి
తక్కినది కొండక్రిందనె దాఁపవలయు

ఆ వీరభద్రగజపతి
తో వీరులు గాచుచుండ్రు దుర్గము శ్రీనా
ధావనిపతియును స్వర్గాది
దేవుఁడును మద్దండధ్యాను స్థిరబలయుతులై

కొండవీటి విజయము.

వారలిట్లు పోవుచుండగా వరలు రాజ
రాజ చంద్రమహాపాత్రి రాయచూరి
భోగ్యుఁడుద్దండుఁడై తన్నుఁ గొలుచుచుండఁ
గనపాత్రుఁడు కనొప్పకరణిఁ గావ

ఖండనభీము లిందఱు నిభంబులబోలె బలాఢ్యు లెంతయో
నందుగలారు సింగములఁ బోల్కని గ్రుద్దుల ముద్దఁజేయు ను
ద్దండు లవక్రవిక్రము లుదారయశోనిధు లెంతొ చుల్కగా
గండశిల ల్మహోతరులు కాఁడదవు ల్గమనింప నేర్తురుర్

మనమార్గంబున రెంషుప్రిక్కల శిలామధ్యంబునన్ డాఁగి చ
య్యన నెమ్మూలలనుండి యేయుదురొ బాణాసార మొక్కుమ్మడిన్
మనసైన్యంబులు వారి ముట్టఁడి గొన న్మార్కో నెఘానో కదా
యను నాఁడెందముకొందలం బుడుపు మప్పా! యిప్పు డిప్పట్టునన్

అని రాయలు వలుకఁ దిమ్మరసు

దారిని గాచియుందు రొగిఁ దప్పక వారలు; కొండవీఁటి కే
దారియు నొండు లే దనుచు దారులు క్రొత్తలు సూడఁబంచితిన్
వీరులఁ గొండల న్దిరుగ నేర్చినవారల వారివెన్నడిన్
జారులు వోయి రందుఁగల జాడల నారసి తేరఁగా వడిన్

కవచధరు ల్ఘోర ప్రణముఖంబునఁ దా మొదిరింప్రతు తొంటిదా
రివలనఁ; గొ్రత్తదారిని దరించును గొండలఁ గొన్ని సైన్యముల్
తవులుదు రా దొర ల్కవచధారులు నింతట వెన్కదారిఁ బో
యి వడిగ ముట్టడింత మది యే కదుశస్త్ర ముపాయ మన్నిటన్

అనుచుండఁగఁ జారులు సని
వినయంబున మ్రొక్కి కొండవీఁటికి జూడల్
జననాయక! కంటి మటం
చన; నా తిమ్మరసు పల్కె నవనీశునితో

శిబిరములందుఁ గొండదరి స్త్రీలను నిల్పి బలంబు రక్షకై
ప్రబలముగా నమర్చితిమి; బాటల నేర్పడఁ జూడ నయ్యె, నే
ను బలము గొంచుఁ గొండగవను ల్వడి ముట్టఁడిగొండు నెల్లియే
యుబుసు ల వేల యుండు మిట నోర్చును శత్రుల రాజనాజ్ఞయే

నా విని పల్కె రాయలు ఘనం బగు సంగరకౌతుకంబునన్
నీ వసహాయశూరుఁడవు నిక్కము నాకరకౌశలంబు యు
ద్ధావని నెన్నఁడే నెచటనైనను జూపకయున్న నన్న! నే
నేవహిఁవాఁడనో జగ ము ఘట్టు లెఱుంగును రాజులందునన్

తల తడియార్చి వెంటనె సుధాధవళాంశుకయుగ్మ మిచ్చెఁ దా
లలన యొకర్తు; పీఠము జలం బరివాణ మమర్చె నొక్కకో
మలి; తిలకంబు దీర్చె నొకమానిని; నిష్ఠను సంధ్యవార్చె రా
యలు లలితాంబికామణిసమర్చనముం గడు భక్తిఁ జేయుచున్

ఘుల్లనియందియ ల్మ్రోయఁ గంకణదీప్తి తళు క్తళుక్కనన్
బల్లవపాణి యొకర్తుక సువర్ణసరోజదళంబులోపలన్
మెల్లన మల్లెపూఁదళుకు మెచ్చని వెచ్చని యోదనం బిడన్
ఫుల్లహృదబ్జుఁడై ప్రభువు బోనము సేసె రుచు ల్నుతించుచున్

భుజియించిన వెంటనె యొక
గజగామిని దెచ్చి యిచ్చెఁ గప్రపు విడెమున్
గజదంతపీఠ మాధవ
రజనీకరదీప్తిలోన రాణులతోడన్

ముచ్చటలాడి కొంతవడి ముద్దియ లిద్దఱు రత్నదీపముల్
గ్రిచ్చుఅఁగొంచు ముం దరుగఁగా స్తలబాహువులూఁత గొంచు రా
జెచ్చెలితమిన్ జనెన్ బడకటింటికి నచ్చరమచ్చకంటులన్
దచ్చనలాడుకాన్తలు పదంబులు బట్టుచునుండ నంతటన్

నెలఁతలతోడ రేయి సుఖనిద్ర నొనర్చెను రెండుయామముల్
మెలఁకువఁ జెందె; జాము మిగిలెన్నిశిఁ దిమ్మరసంతకంటె ము
న్దెలసి యమాత్యులం గలిసి నిల్చెను మంత్రిగృహంబునందు రా
యలు నటయేఁగి కార్యముల నంత విచారణసేయుచుండఁగా

అరులు తలెత్తకుండఁ జనుమా పరరాజు మఱుంగుఁ జేరె నం
చుర వగు వేగుఁజెప్పఁగతి నుప్పరవీథిని దోఁచె వేగుచు
క్కరసి యినుండు కొండపయి కాయితమై తనసేన లెత్త ను
త్తరు విడు మంచుఁ జెప్పెను బ్రధానికి దానికి మెచ్చెనాతఁడున్

ఖగములు గోలుపోయెఁ దమకాంతిని మింట, నగాగ్రసీమలన్
ఖగములు గూసె సంతసమున, న్ధరలో విధిచోదితంబులై
వగయు సుఖంబు గల్గు జనపాళికి; నస్తమయం బినోదయం
బగుగద దేశభేదమున; నద్రిని నిద్రయు భద్ర మిచ్చుటన్

ఆసగి మొప్పె నప్పుడు రథాంగపతంగ సుసంగతిప్రదా
నానత సర్వలోకకలుషాన్తక భాస్కరకల్యహారి స
ద్భాను విభా జతూరస విభాసిత కుంభమతంగజాభమై
కాననగుల్మ నధ కిసకాన్తి విసర్జిత సాంధ్యరాగమై

రణపటహారవం బెసఁగె రమ్యముగా రణరంగనిర్గతో
ల్బణ రథిరథ్యదన్తి రుధిరస్రవ చందనచర్చితార్య వా
రణఘనసంగరాంగణ పరాహతరాజకుమారసారవా
రణగమనా స్వయంగ్రహాసురప్రవరాహత తూర్యనాదమై

రవియుదయించునత్తఱిని రాయ లనీకినిఁ దోలె నొక్కకేరి
వ; వడి నమాత్యుఁడున్ మఱొక్కవై పునసేనలు ఱొప్ప నిట్టటున్
దవిలి చమూతరంగములు ద న్నటు లోఁగొనఁగొండవీటినా
క వెతల మున్గకుండు నెటు? కాలవశంబునఁ గ్రిందుమీఁదగున్

ద్విషదస్థంకరణప్రతాపుఁ డగుచు న్విద్విడ్రమాకంఠ
శ్లేష మున్నుండుఁ బరాబరు ల్బలుప నాలేలిహ్యమానాంబరో
న్మిషదాత్మధ్వజినీపతాక లెలమి న్మి న్నంది గ్రాల న్మహో
వృషసంహార్యమనఃప్రధావకహరిశ్రేష్ఠంబు నాఁ గ్రాలుచున్

రవ మొకయింత లేక కటుల రాయలమూఁకలు చాపక్రిందినీ
రువలెన్ను గొండ నెక్కి నగరుం దరిసె న్బటహధ్వను ల్దివిన్
దవులఁగ మంత్రిదండు సనె దారిఁ గలంపఁగ, నర్ధసిద్ధి నొం
డివెలయుశాన్త చిత్తుఁ;డదిద్రెక్కొనుగాఁబులుప్రేలు చన్యుఁడున్

కొండవీటివిజయము.

అంత నట సభ దీర్చి కొండవీటి దుర్గంబున మంత్రులతో
పలికె నంతట నావీరభద్రనృపతి
సేనఁ గొని కృష్ణరాయలు సేరవచ్చెఁ
గటకపురిసేన లింకను గాన రావ
యిల్లు గాలినపిదప నూయేల త్రవ్వ.
మంత్రి వలికెను నేఁ డెల్లి మనకు సేన
వచ్చు; నే లట్లు చింతింప? వచ్చి రాయ
లేమి చేయును? కొం డెక్కి నె ట్ల దేమి
పగులునే తల దు డ్డంచుఁ బలికినంత?
కొం డంతయుఁ దలక్రిందుగ
గండశిల ల్ద్రోయ సేన గలదు మనకు; నిం
కొండు దలంపఁగ నే మగు?
దం డంతయుఁ గొండనిండ దాఁపఁగ వలయుఁ
కొం డంతకాయ గత్తికిఁ
గొండే! తా నెంతదండుఁ గొని వచ్చిన నా
తం డేమి సేయు? నది వే
దండ మణఁచు మొసలి, నక్క యనని మొసలినిన్

అనునెడఁ జీఁకటిఁ దడబడు
మనుజునకుం దీప మబ్బ్యమాడ్కిఁ బతికిన్
దనతండ్రిసేనఁ గాని వ
చ్చె ననెను నవ్వార్త శ్రవణసుభగం బయ్యెన్

గజపతి యంతలోనఁ దనకై యసువుల్బలి వెట్టఁజూచు మి
త్రజనముఁ జూచి యిట్టు లనె, రాయలసైన్య మెదిర్చి యుద్ధభూ
రఁ జనదు; గోటలోపలఁ జొరంబడకుండఁగ జాల నూఁచలన్
గజబిజి సేయుఁ డొక్కమొగిగా గిరిసందులనుండి త్రోవలో

చెదరిరి పుట్టనుండి చలిచీమలభాతిని గొండపై భటుల్
చదురునఁ గందుకీఁగలప్రచారము సాగము చూపు తూపులన్
బొదలెను నాల్గువైపుల, నభోమణియు న్గిరిచాటు దాటి రా
బెదరుచుఁ దొంగి చూచె బదవిం దరుసంఘము సందుసందులన్

శిలల గుభాల్గుభాల్ధ్వని విశేషముగా దివిముట్టఁ గొండపై
విలయ ఘణాల్ఘణాల్ధ్వని రహించెను దప్పుల, మీఁదనుండి యా
చలజడివాన ముంచె; నలశైలము మూఁచెఁ గ్రమగ్రమంబు రా
యలబలవార్ధి వెల్లువ విహాయస మంటి భయంకరంబుగా

సందుల గొందుల న్మశకసంఘము దాఁకు సివంగికూనలన్
జందము సూపి తిమ్మరుసుసైన్యము డొక్కలు సీల్చెఁ గొండవీ
టం దలగల్గువారి నకటా తటి మించె నిఁ కేమి సేయు నం
చందఱు నొక్కపెట్టున బయల్వడి తాఁకిరి మంత్రిసేనలన్

కవచములు వ్రీలఁ; జేతిఖడ్గములు రాలఁ,
దలలు దెగి వ్రాల; డొక్కల నొలిచి ఊలఁ
గొట్టి కసి దీర్చుకొన మంత్రి యట్టె తనదు
బలము లప్పుడు వెనుకంజ వైవఁ జూచి

యోధున కేవు రేవురుగ నొక్కమొగి న్బడి తాఁకుఁ; డేమిమీ
సాధనము ల్గొలంబడెనె? శౌర్యముసూపుఁడు ధైర్యమూనుఁడా
యోధనభూమి నేఁ గలుగ నోటమి గల్గెనె? యెన్నఁడైనఁ గా
నీ ధరఁ జావు దప్పునె? హిహీయని నవ్వరె వెన్ను జూపినన్?

వారక వీరభద్రుఁడు కవాటము గాచుచు వైరిసేనపైఁ
దోరపు ఊలు యస్త్రములఁ ద్రోయఁగనుత్తరువిచ్చె; నిచ్చినన్
ఘోరన ఊలవాన లరిమూఁకలపైఁ గురియించి దుర్గసం
చారులు; మూఁకుమూలలను సైన్యముదాఁచెను రాయలంతటన్

ఇరవుగ నింతవారలై మహీస్థలిఁ గుంటెనకాఁడు నైనచోఁ
గరణము లెన్నియుండినను గార్యతతు ల్ఫలియించు నింకెటుల్?
ల్సరగున సాలమం దోడిసెల ల్గొని దుర్గభటాళి యేయుచో
లరులకుఁ దాఁక కుండఁ దమ కవ్వలి వారిని గాచు నిల్వఁ జాల్
దూరమునందు నెక్కొలిపె దుర్గముచుట్టును సేన; లందులో
వారలు పైకి రాక పయివారలు లోనికిఁ బోక యుండ సం
భారము లన్ని వెచ్చపడి మంత్రులు దానను దిండి లేక యుం
డే రహి నెన్నినాళ్లు భరియింపఁ గలాఁడని యెంచి రాయలున్

అంత నక్కడ

హోరాహోరిగఁ బోరెను
శూరత దుర్గేశుబలము సూపఁగ మెచ్చన్
క్రూరతఁ జూపెను మంత్రి
ప్రారంభము; దాని కోర్వ రామి వెనుకకున్

తోలఁగిరి గజపతిసైనికు
లలగిరిదుర్గంబునకు మహోత్వరఁ దమ్ముల్
జెలఁగి రిపులు దోలుచు రా
నిలఁ గిరితతి పులుల కళుకు నెసకం బెసఁగన్

మార్గము వెల్లడౌట; నలమంతిరి సేనలఁ గొంచుఁ జెచ్చెరన్
దుర్గము సేరఁ బోవఁగ; నెదుర్కొనె రాయలు మత్తవిద్విష
ద్వర్గకరీంద్రకేసరిఁ బ్రధానిని; నిద్దఱుఁ గొంతసేపు స్వాం
తర్గత కార్యసంతతికథంకరణీయత చర్చ సేయుచున్

పదపడి దుర్గము న్విడచి శౌఁజుల రెంటిని జోడుగూర్చి స
మ్మదమున నొక్కచో విడిసిమార్గము లన్నియు ముట్టఁడించుటే
చదురని యెంచి యొప్పు డెది సైనికబృందము గోరుచుండు న
య్యదనున వారికద్ది యిడు నచ్చటు వాయక నిల్చి యున్నతిన్

ఈముట్టఁడి మాతండ్రియు
నేమొలఁపునఁ ద్రోయువాఁడొ; యెటు రా నగునో
దోమయుఁ బో రా వెఱచు నిఁ
కే మయినను దలుపు దెఱచి యేఁగెద ననికిన్

అన నటఁ జారు లిద్దఱు మహోత్వర రాయలయొద్ద కేఁగి యి
ట్లనిరి; మహాప్రభూ! ప్రబలయానములం గరుల న్పదాతులన్
గొని యదె వచ్చె నాకటకకుంభినిభర్త ప్రతాపరుద్రుఁ డేఁ
పున; నలకృష్ణ కింక మఱి మూ డుదినంబులె త్రోవనుండెనాన్

వీని తమ్మరుసును గని రా
జనె సీతమ్మనకు వార్త నంపితి మపు; డిం
కను బల మనుపఁడు; కృష్ణకుఁ
జనియెద నాసేనఁ గొనుచు సమయము మించెన్
అనిన విని మంత్రి రాయలతో
విజయనగర్యసీకినియు వేగమ వచ్చును నేఁట నెల్లిటన్
త్రిజగము లెత్తివచ్చినను దేటి కనం దరమే ప్రతాపరు
ద్రజనపతి స్మహాచతురత న్మనువచ్చినదారి నంపు నీ
భుజకరవీరధారకును మ్రొక్కులు వెట్టక పోవ నేర్చునే
వీఁడు ప్రతిప్రసవ మయె
న్నేఁడు మనము వీరభద్రుని న్వాలిపుచ్చన్
వీఁ డెఱుఁగఁడోటు! పరవిధి
యోఁడును బూర్వ్రత్రవిధికి నో క్కపు డనుచున్
తనపక్షం బిటు చెడిపో
యిన నెట్లగు సాధ్య మింక సేసాధనమున్
దన కున్నను మన కాతం
డెనయే! గగనారవిందమే! యిది తలఁపన్

## కొండవీటివిజయము.

కొండవీటిని విడిపింపఁ గోరి యితని
రాక తొదిరి నెఱుంగమి రాజ్యభంగ
మునకె; కారణదోషానఁ బుట్టదె విప
రీతకార్యము సంకునఁ బీతతవలె

ఎల్లి నిశాముఖంబునకు నెల్లవజీరులు నెల్లసైన్యముల్
తల్లిని జేరు పిల్లలవిధంబున నీదరిఁ జేరువారు ని
న్నెల్లశుభంబులుం గలుగ నీశ్వరుఁ డోముత; వారితోడ నీ
వెల్లి వసించి శత్రుపయి కెత్తు; జయం బగు నిష్టసిద్ధియుఁ

చను శిబిరమునకు నీ; వి
దినమున సుఖముండి బయలుదేరు; శిబిరర
క్షను మనయప్పన కప్పన
మొసరుపు; మరి నొంప నోపు నుగ్రుఁ డతంఘున్

అది విని రాయలు మంత్రితోఁ జెప్పి పయనంబై
వెంబడి కొండ ఆశ్వికులు వీర్యఘను ల్వెఱతేర వారితో
డం బురికొల్పె నశ్వముహుటాహుటిఁ గాన్తలఁజూచువేడ్కముం
దుం బరువెట్ట; దాపలికసు ల్చెదరె న్విభునాండ్రు కంతలో
సంబరరత్న మస్తగిరిహార్మ్యవిహారి మొనర్చె రక్తిమ

శిబిరమున బుక్కమాంబయుఁ జిన్నమాంబ
దివసములు లెక్కపెట్టుచు దినదినంబు
వ్రతములను వాడి పసమించురవణ మూడ్చి
పతిగుణంబులు చెలులతోఁ బాడుకొనుచు

పతి పరు నోర్వఁ బోయి యొకపక్షము నిండెఁ; బ్రతాపరుద్రభూ
పతి సుతుఁ గావ వచ్చె ననువార్త వినంబడెఁ; గార్యభారము
న్నతి గనె; నే డె ఱానో కరుణామయ! వీరనృసింహ! భర్తకున్
పతముజయంబుఁగూర్చుమనిస్వాంతములం దలపోతు రచ్చెలుల్

అటు పలవించుచున్నమదిరాక్షుల కగ్రిమదూతబోలె న
స్పటిపటుకాహళధ్వని; చివాలున వాకిట నిల్చె నశ్వమున్
దటుకున రాజునుం దిగి విధానము తప్పక యశ్వకంధరా
తటము కరంబున న్నిమిరి తట్టియు నంతిపురంబుఁ జేరెనన్

వనిత యొక్కతె నివాళినిబట్టె విభునకు
దిష్టితీసె మఱొక్కతెఱవ పతికి
లలన యొర్తుక పాదజల మీయఁ బ్రభుపాద
ములను గడిగె నొక్కమెలఁతమిన్న

## కొండవీటివిజయము.

తడియొత్తి పీతంబు నిడి నొకలేము;
కూర్చుండ నురటీ వీచె నొక్క గరిత
పత్నులతోఁ గొంత వడి ప్రసంగించి
భోజన మొనరించి తా శయనగృహముఁ
జేరి సుఖనిద్ర సేసె దేవేరు లెలమిఁ
పాదసంవాహన మొనర్ప మోదమునను
వందిమాగధగానంబు భవ్యవాద్య
ములను విని లేచె మరునాఁడు భూమివిభుఁడు

విజయనగరమునుండి గోవిందరాజ
దండనాథుండు వంచినదండు విడిసెఁ
కృష్ణరాయనిశిబిరంబు కెలన సంజ
వేళ నెన్మిదిలక్షలు భీకరముగ

అది గని యుబ్బి రాయలు రయంబున నచ్చటి కేఁగి వారితో
నుదయము గాకమున్న మన మొయ్యన నెత్తుటయొప్పునం చనెన్
ముదమున సేన లన్నియును మ్రొక్కి హసాదనె; నాఁటిరాత్రి యా
కదనపుసంవిధానమునఁ గాలము పుచ్చె నొకింత సుప్తుఁడై

అంత

తెలతెలవాఱెఁ దూర్పు; నలుదిక్కులఁ జీఁకటి మేల్ముసుంగులున్
దొలఁగె; నినుం డొసంగెను ననూరున కాజ్ఞ రథంబుపూన్పఁగా
గొలగొల సేనలు న్నడిచెఁ గుంభిని యల్లలనాడె వ్రేఁగునన్
తెలిపసవారువం బపుడు దెమ్మని యుత్తరు విచ్చె రాయలున్
వలగొని దుర్గకు; న్నగరివాకిట ధేనువును న్స్పృశించి, యొ
జ్జలు శ్రుతులం బఠింపఁగ హజారము చెంగటఁ బూర్ణకుంభముల్
దలనిడి యిద్దఱైదువలు దారసిల, న్నడుమందుఁ గైదువుం
బలుకయు మూపున న్మెఱయ వారువము న్నడిచె నెక్కెఁ; నెక్కుచున్

మును హనుమానుని గరుడుని
మనమున శ్రీకార్తవీర్యమహీపతిని గణే
శుని మ్రొక్కి రాయ లంతఁ బ
యన మయ్యెను సుశకునంబు లన్నియుఁ గనుచున్

నారపరాజు సేనలకు నాయకుఁడై తొలుదొల్త నేఁగ; నెం
తే రణకౌతుకంబున మహీశుని వెన్నడి బుక్కరాజు మే
ల్వారువ మెక్కి రాఁగ; నిరుప్రక్క వజీరులు పెమ్మసానివా
రైరి; ధరాపరాగము రయంబు హయంబులు మెచ్చ వయ్యెడన్

## కొండవీటివిజయము.

కోలలు విండ్లుఁ బట్టి వెలుగోటివజీరులు నూటి కొక్కఁడే
చాలు ననంగ సేనఁ గొని చాగిరి పెండ్లికి నేఁగురీతి; నం
ద్యాలదొర ల్టకాటకి హయంబులడెక్కలచేత శత్రులన్
నేల కణంపమే యనెడునిబ్బర ముబ్బఁబ్రయాణమై రొగిన్

దివికిఁ బదంబు లెత్తి జలధి స్లయవాతసముత్థితోర్మ్ము ల
ల్లవిరళపంక్తులం దవిలి యశ్వము లేఁగుఁ బ్లుతక్రమంబులన్
జవమునఁ దమ్ము ఖించ గజనాథుల శక్యమె? యుత్సవంబులన్
నవలలతోడ మందగమనంబుల ముందట నేఁగుఁ గా కనన్

పరువులు దీసికొం చెగసిపా టది మేలె? జలంబున న్భువిన్
పరఁగుదు మొక్కతీరుననె; వైభవ మేటికడ స్సనం దగున్
ధర మునువెన్క లెంతురె యుదారులు? అవ్వియు గుజ్జుమొక్కట
న్వైరవున మెల్లఁగాఁగరులు వెన్కఁ జను న్నడగొండలోయనన్

సంజకెంజాయ లెల్లెడ జలముసందుఁ
బర్వ నలకృష్ణ సూచించెఁ బ్రథనమందుఁ
గృష్ణరాయఖరాసిని గెరలి పాఱు
భటులరక్తప్రవాహంబు నిట్లె యనుచు

అంత నక్కడఁ బ్రతాపరుద్రుండు దన సుతుని విడిపింపఁ
గటకపురినుండి బయలువెడలి వచ్చునెడ

భద్రగజంబు లెక్క బలభద్రముకుందులు రెండుప్రక్కలన్
సద్రభసంబున న్గొలువ సమ్ముఖమందుఁ బరాక్రమక్రమో
న్నిద్రుఁడు ఖడ్గపాత్రుఁడు ననిర్గళుఁ డా యసహాయుఁ డేఁగఁ గా
నద్రిసదృగ్గజేంద్రమున నాయితుఁ డయ్యెఁ బ్రతాపరుద్రుఁడున్

ఇరువదివే లశ్వంబులు
కరు లవి పదుమూఁడునూర్లు కాలరులు ధరా
ధరధీరు లైదులక్షలు
సరవిం దనతోడ నడువఁ జనె రణమునకున్

తరమే యోరికిలన్ బ్రతాపఘనరుద్రప్రక్రియున్ వీరభ
ద్రరసాధీశ్వరుఁ గిన్నమేటి నెదుర; న్దాఁ గృష్ణుఁ ఔటంగదా
భరియించె న్నదుపాయపాటవమునన్ భర్గు న్రమాధీశున
ట్లురుమేధాబల మెక్కుఁ ఔను ధరలో నూహింప నెద్దానికిన్
దురమున గెల్పు యుంకువని తోయనిధు ల్వరులంచు; బెండ్లికూ
తురు నది కృష్ణ యంచు; విని తూర్ణము తాము వరింప దక్షిణో
త్తరజలరాసు లేఁగెడువిధంబు గనంబడె రెండుసేన లు
ద్ధురతను రెండుదిక్కుల నెదుర్కొనఁ బోయెడుచోడఁ జూడఁగా

ఓటమి యింత లేక నది కుత్తరతీరము నొందె సేన క
ర్ణాటబలంబు దక్షిణము నాదుకొనె న్నది; రెండుసైన్యముల్
దాఁటఁగ వాటమౌనటుల నౌకలు దెప్పలుఁ గూర్పఁ; జూచియి
ట్లేటను మున్గి యుందఱు నదేలొకొ చావఁగ నంచు? రాయలుఁ

తమకం బెత్తి నదిం దరించునపుడే దండు ల్వడిం బోరికిం
గమకింపం జెడుఁగాదె వ్యర్థముగ సైన్యం బేరికైన న్నదిం
దమరే నించుక వీడి వెన్కకరుగ న్మాసేనలే దాటెడున్
మముఁబొండన్నను బోదు మేము; తమరైనం దాట రామే లగుం

అని రాయం డిటు వాచికం బనుప నౌనౌ రండు మీరే; బలం
బును గొం చేఁగెద మేము వెన్క కొకగవ్యూతిప్రదేశంబుగా
నని యేఁగె న్గటకాధినేత; యిదియే యాయోధనం బందుఁ దాఁ
జను వెన్నిచ్చి యటంటకు న్గురుతుగా; శక్యంబె దాట న్విధిం

సేనలఁ గొంచు నద్దరిని జేరెను రాయ; లినుండు పశ్చిమా
శాసలినాస్య ముద్దుఁగొన సంభ్రమ మొందెను; నాఁటిరేయి సే
నానులు సేనలు న్సుఖమున న్నిదురించిరి; యుద్ధడిండిమ
ధ్వానము మిన్ను ముట్ట నలపౌఁజులు రెండును దాఁకెఁ బ్రొద్దునం

తుములరణంబున న్దరను ధూళులు రేఁగుచుఁ జీఁకఁటై స్వనా
మములును జేరుకొంచు భటమండలి పోటునువ్రేటు జూపుచు న
శ్వములును దంతులొండొకటిఁ జయ్యనమూర్ఛనిమొంచిశత్రులన్
గ్రమమునఁ గాటుపోటు; తమకంబునఁ దాఁపునుద్రోపు జూపెదుర్

నెత్తురుధార లొల్క ధరణీరజ మంత యడంగఁ జూచి రా
హుత్తులు ద్వంద్వయుద్ధమున నోహరిసాహరి బోరి రుద్ధతిన్
దుత్తము రయ్యో వర్మములు తూఁట్లుబీఁటలువాఱెగుండియల్
చిత్తము లేక గెల్తు మని సాహస మొప్పఁగఁ బోరి రందఱున్

ప్రేవులు ప్రోవులై పఱచె భీకసర్పములట్లు; కాళ్లుపో
న్నాళ్వులు కావులై పదట నక్రములట్టుల పాఱె నెత్తురుల్
డ్రోవలు బావులై నెగడె రొంకి గలంచు పొలంబుల ట్లిఁకన్
జావులు హెచ్చెఁ బోరి; నిహసౌఖ్యము నశ్వర మంచు నెంచెనా

ఇమ్మరాజు కరీంద్రము నెక్కి భీము
పాత్రు జొమ్మునఁ బొడిచెను బల్లెమునను
బలికతోఁ బోటుఁ దప్పించి పాత్రుఁ డప్పు
డీటెతోఁ బోటు సూపిన వీటిబుచ్చె

తమహాయంబుల ముందుపాదములు దెగినఁ
దిమ్మనాయకుఁడును ధర క మ్మ్రుకుంద
పాత్రుఁడును డాఁటి తాఁకిరి బవిరెడ్డిఁగ
లట్లు, పాత్రుఁడు బొసుమ నాయకుఁడు సొగసె

పరుతోఁ బోరఁగ నెత్తిన
కరవాలము-యెదిరిఁ బొడిచి కసి దీర్చుకొనుం
గర మరుదుగఁ దల దెగియును
బరువిడు మొండెంబు శత్రుపైకి గఱగఱిన్

అరిఁ బొడువ ఖడ్గ మెత్తిన
కర మన్యుఁడు కెలన నిలచి ఖండింప నదే
ధరపైఁ బడియును దుర్లుచుఁ
గరులయు నశ్వంబులయును గాళులు నఱకున్

మదకరు లెక్కి యెండొరుల మర్మముల స్వరజాల మేయువో
వదలని కిన్కలోఁ దవిలి పై నెఱమంటలు గ్రమ్మ నస్త్రర
వృదయశశిపభ న్ముఖము లొప్పెను నీలగిరీశుతోడ స
మ్మదమున నిమ్మరా జెదిరి మార్కొనఁజూపఱ కింపునింపుచున్

పొడిచినపోటుతో రుధిరపుంబెనుధారలు చిమ్ము చుండఁ బైఁ
బడునెడ వస్త్రము ల్దడిసి భారముఁ జూపఁగ నీవ లావలన్
బిడుచుచు శత్రులం బొడుచునేర్పు వసంతమహోత్సవంబుసూ
పెడు; వరయోధపాళి కని పెండిలివంటి దగున్ జగంబునన్

వ్రేటున మస్తకంబు దెగ వ్రేయ నదట్టులె నిల్చియుండఁ దా
నోటమి లేక శత్రుపయి హుమ్మని పోయెడువీరవర్యు నా
వాట మెఱెంగి యన్యుఁడు చివాలునఁ దన్నెను బాదకందుకం
బాటలఁ దన్ను రీతిఁ దల; సంతట నార్చిరి జోదు లందఱున్

చెలఁగి తాళచ్చేరు సింహఘోషునితోడ
శ్రీరంగరాయండు బోరఁ జొచ్చెఁ
దొడరి ధంకానాళదుర్గేశ్వరుఁడు రూప
నారాయణుండును సఱకుకొనిరి
నీలగిరీశుతో నాలంబొనర్చె నా
రామలింగన్న సతాసరిగను
హిందోళదళవాయి నిమ్మరా జెదిరించె
గుజ్జంగపతి నేఁ గొండమరసు

కణికరాజుతోడఁ గడఁగిరి నంద్యాల
వారలు; భంజుతోడఁ దొడరెఁ బద్మ
నాయకుండు; నాళినరపతితోఁ దాఁకెఁ
దిమ్మనాయకుండు తేజు మెఱయ

మూఁడు దినంబులు పోరిరి
వాఁడి సెడక గజపతీంద్రు వారలు సేన
లూర్మఁ డవు పాళులు గెడసెను
దాడి విడచి పోవ మంచితటి గనిపెట్టఁగ

వారల పుణ్యావశంబునఁ
జేరెను సూర్యుండు నస్తశిఖరిదరికి యు
ద్ధారంభము నిలువంబడెఁ
జేరెను బాలెంబులకును సేనలు రెండుఁగ

అపుడు ప్రతాపరుద్రుఁ "డరి నాహవమందు జయింపలేము; యిం
కిపు డెదిరింపఁ దక్కుడుగ యాబల మేనియుఁ బ్రాణము ద్ధెగుఁగ
దపనుఁడు దూరకుండఁ బురిదారిని బోద" మటంచు నస్తగో
దుపతి గృహంబులం గలిసి డొంగినభాతిని డొంగ సేనతో

కర్ణాటకసేనలును ప
వర్ణాగ్రజునుదయమునను పౌజులు దనరన్
స్వర్ణాభేనకరద్యుతి
వర్ణితకకుబంతరముగఁ బఱచెఁ దరులపైన్

పాలికల నంతయు న్వదకి ముందఱి కేఁగుచుఁ గొంతదూర మే
స్థలమునఁ గాని శాత్రవులజాడలు లేమికి సంతసం బెదల్
దలకొనఁ గృష్ణరాయనిదళంబులు కెవ్వున నార్చె; నార్చినన్
కలతెఱఁ గంతయుం దెలిసి క్రన్నన రాయలు నవ్వి యిట్లనెన్

మన కిట. యేల? శాత్రవులు మాఱొకొనఁ జాలక కాందిశీకులై
చనిరి; పదంపు దండు గొని చయ్యనఁ; జాల నలంతఁ జెందినా
రని నలకొండవీటికడ హాయిగ నుందురు గా కటంచు నా
విని దళవాయు లంత నడపించిరి వచ్చినజాడ సేనలన్

విజయధ్వజ మెత్తించెను
ధ్వజినిన్ శ్రీకృష్ణరాయధరణీపతి; నా
రజనీకరబింబము దోఁ
చెఁ; జనియె వేవేగ సేన శిబిరముకడకున్

రాయలు యుద్ధమున కేఁగినమరునాఁడు; అక్కడఁగొండవీటను వీరభద్రగజపతి మంతనంబున మంత్రులం బిలచి యి ట్లనియె

కటకానీకినితోడఁ బోరఁ జనియె న్గా రాయఁ డీమంత్రి యు
త్కటసైన్యంబున మమ్ము ముట్టఁడిఁగొనంగాఁ జూచె; ని ష్ఠీతనిన్
బటుమాయాబలవిక్రమక్రమమున న్బంధించి యే ల్లేని ని
చ్చటికిం దేఁగల వీరవర్యునకు నీస్థానంబు జాగీ రగున్

అన రెన్నాళ్ళకుఁ దిమ్మమంత్రి కలరాయం డంపిన ట్లొక్కచీ
టినిఁ జారు ల్గొనిరాఁగ నిచ్చి చదువన్ "ఇక్కడ నీ కుండ నీ
యనిన్; కీవు బలంబుఁ గొంచు వడి రమ్మా మించుఁ గార్యం" బటం
చని యం దుంట నెఱింగి వ్రాయసపుఁ జాయల్జూచె సందిగ్ధతన్

రాయలు సూచుచుండఁ దనచారులు దెచ్చిరి వాచికంబు నా
రాయనియొద్దనుండి "రణరంగమునం దిరువాగుఁ గ్రూరమై
హేయఁగఁ జొచ్చెఁ; దప్పక జయింతుము; వేసవితోఁటిసాటి వెన్
దీయఁ దొడంగె శత్రుబలతేజము" ల న్శుభవార్త గాంచుడున్

నిన్నఁ బ్రభాతవేళఁ గద నేర్పున భిక్షుకవేష మూని నా
కన్నుల దుమ్ము గొట్టితిరి? కాశికి నెంతటఁ బోయి వచ్చినా
రున్న తెఱంగుఁ జెప్పు టది యుత్తమ మిప్పుడు; ప్రాణముండనే
నన్నియు పన్న వచ్చుఁ; జెపుఁడీ యెవరో? యిట వచ్చు టేలకో?

వెలిపింపఁ బోయి తానే
వెలివవలసెఁ బట్టుపుర్వు బిరబిరఁ దాఁ జొ
ప్పఱచిన యల్లికఁ దవిలిన
తెలఁగున దుర్గేశుమంత్రి ధీరతఁబల్కెన్

భేదము సేయఁగ వచ్చితి
నే దుర్గేశ్వరునిమంత్రి నీవలెఁ బతికై
యీఁదితి నుపాయజలనిధి
నాదైవము సాల కుంట నలఁగితి నీచే

అనుడున్ దిమ్మరసు

చేతం జిక్కిననిన్ను నేఁ డిచట నేఁ జేయంగ నేమే నగున్
నీతంత్రంబు లిఁకెన్ని బన్నఁగలవో నేఁ జూడఁ గాంక్షించెదన్
జేతస్సార మెఱుంగ నయ్యెఁ; జనుమా! చేబారల న్సంద్రమీ
వే తీ రొంది తరించెదో తెలియు నేదీ! పోయి రమ్మా వడిన్

అంత నతండు వెల్లనైన మొగంబుతోఁ జనియెఁ బిదపఁ గొన్ని దినంబులు దుర్గాధీశుండు మంత్రితోఁ బోరి విసివి కాలుసేయరా డక రొక్కనాఁడు మంత్రులం గొలువు సేర్చి యిట్లనె

యుద్ధము సేసి చేసి మనయోధులు వేసటఁ జెందినారు; నా
బుద్ధికి నిప్డు కాఁపుదల ముఖ్యము మీఁదికి వారు రానియ
ట్లు ద్ధతిఁ గోటఁ గాచుకొని యుండఁగఁ బంపుఁడు;గోడయున్న చో
సిద్ధము సేయ వచ్చుగద చిత్రము లెన్నియొ యొన్నఁడేనియుక్

యోధుల కిండు పూర్ణముగ, నొడ్లకు భుక్తి తదర్థమిండు, తను
ద్బాధ తొలంగ దేని మఱి తౌడును గూరలు నిండు, కొన్ని నా
ళ్లీధృతిఁ బూనకున్నఁ దిన నెంతయొ ద్రవ్యము లేదు కోటలో
నేధన మున్న నేమి? కడు పెండిన రూకలు తిందురే భువిన్?

రాయలసేనతోడ సమరం బది యెవ్వరికేని దుర్ఘటం
బాయుధపాటవంబు గల దైనను స్థానబలంబుకల్మి నీ
చాయకుఁ జేర కుండఁ బెలుచ న్నిలుపం దగు; నాఁడునాఁటికిన్
ఛాయఁగఁ జొచ్చెఁ దిమ్మన, కడంగి నిలుం డలకోటగోడపై

అనిన మంత్రులు వల్లె యనిరి. అంత నిక్కడ

జయముం జేకొని రాజు వచ్చె నని తా సంతోషముం జెంది తి
మ్మయమంత్రిప్రభుఁ డేఁగె న స్పెదురుగా; నాయిద్ద ఱాయోధన
క్రియలంగూర్చి యొకింతఁ జెప్పుకొని; రద్ది న్మంత్రియుం జేరె, నా
పయి వేలంబున కేఁగె రాజు, బలముల్ బాళెంబులం జేరఁగా

నిర్ఘృణతిమ్మామాత్యా
నర్ఘాయుధ మణఁచు గడియ కన్యదుర్గ; మం
తర్ఘటితపరి స్తరమై
దుర్ఘట మయ్యెను దెరల్ప దుర్గ మిది వడిన్

రాయలు బుడ్తగీచుల ఫిరంగులతోఁ దనసేనలోనఁ దా
నాయితపెట్టఁ గానఁ దన కంతట దుర్గము లెట్టివే న్పడిన్
ద్రోయఁగ శక్యమౌ; నొరులెదుర్కొన నెట్లగుఁ? గొండవీటిదు
ర్గాయతగోపురం బహరహంబును వ్రస్సె ఫిరంగితాఁకులన్

అట్టులె రెండుమాసము లహర్నిశ మాతఁడు గొండవీటిపై
ముట్టడి సేసి పోర, భటముఖ్యులుఁ దానును రాత్రులుంబవల్
మెట్టిన కిన్క నిండుబలిమి న్బురియించెను దుర్గరక్ష య
ప్పట్టున, రొంపి మున్గిన యిభం బయి యెట్టటూ వీరభద్రుఁడున్

మంత్రిమోసముమొదలు తిమ్మనయు జాగ
రూకుఁడై యుండఁ; జారులరాకపోక
లకును సందీయమిని, రాయలకును దండి
కీని జరుగు యుద్ధఫలితము వినఁగరామి

వీరభద్రుండు మంత్రులం బిలచి, గోపు
రంబుపై నెక్కి. తెలివిషయంబు గాంచఁ
దెలియు నేమేనిఁ దన; కని తలఁచి చుట్టు
నరగఁ బరికించి పలికె నాసచివవరుల

గోపురం బీఁక వ్రీలును; గోటగోడ
యచ్చటచ్చటఁ బ్రిదులంగఁజొచ్చె; నకట
పోవమార్గము లేదు; మాపులును బవలు
నిద్ర యాహారమును లేక నెగ్గు పుట్టు?

సంగరమందు నక్కటకసైన్యము వీఁగుట నిక్క మంచు నా
కుం గనుపట్టె; నల్లదె యకుంఠితతేజుఁడు; కృష్ణరాయనే
నాంగముధూళి గ్రమ్మె; ధ్వజ మల్లదె! తెల్లనివారువంబులుం
జంగున దాటు నల్లవిగో! సందడి విన్బడఁ జొచ్చె నుద్ధతిన్

గజపతిఁ దిన్నసింగమును గానసత్వము లింక నెవ్వ నో
ర్వ జతనముం బొనర్చు? విధివైభవ మేమన వచ్చు? చాలు! నీ
గుజగుజ లెల్ల నిల్పి యుకుకుం డిఁకఁ బోరికిఁ, జా వొకప్పుడేఁ
బ్రజలకుఁ దప్పునే! ధరణిపాలుర కింతును జావఁ బాడియే?

అన దుర్గమంత్రి గజపతితో నిట్లనియె

చండతఁ జూప వచ్చు నరిసారము లోఁగిన; నెక్కు డైనచో
మొండవితాన వెన్కకును మేకొని పిమ్మట డీకొనం దగున్
రెంటను గుర్తెఱుంగు ధరణీధవుఁ డౌటఁ బ్రతాపరుద్రుఁ డీ
గండలగండనిం దవులఁ గా దిపు డంచుఁ దొలంగెఁ బోరికిన్

అదిగాక,

విధి దాఁట నెవరిశక్యము!
మధువిద్విషునంతవాఁడు మూఁరురూపులన్
బ్రధనంబున శాత్రవుల
న్వ్యధియించె న్గాని; యెదురు వడెన తానుగా

రావణునంతవాఁ డసురరాజ్యము గోల్పడె వానరాళిచే
శ్రీవరునంతవాఁడు రఘుసింహుఁ డరణ్యము సేరె దాసిచేఁ
పావనద్రౌపదీరమణి భంగము నొందెను జూదగానిచే
దైవముఁ ద్రోయఁగా వశమె ధాతకును న్మతి వానితాతకున్

బలవంతుఁడు దుర్బలుఁ డగు
బలహీనుఁడు ప్రబలు; శీలవంతుఁడు దుష్టుం
డిల నగుఁ; గాలము మార్పుఁ
ఫలపాకము నిష్ఫలతయుఁ బర్యాయముగా

దవ్వాయె చేవ యాను; గడుతాపమొనర్చుసుధామయూఖముల్
నవ్వినయూళ్లె పట్నములు, నచ్చినబంధువు లెల్ల శత్రువుల్
గవ్వాయె నాణెమా మఱొకకాలమునం; దిలలోన సత్ఫలం
బివ్వవు కార్యము ల్జతన మెంత యొనర్చినఁ గాలశక్తిచే

నీ వనినట్లు నీగురుఁ డని న్మృతి నొందుట నిక్కమైన, నీ
చావఁగ సాహసించు టది చక్కటికృత్యము గాదు; కొండవీఁ
డే విడి నిల్వుమా కటక మెట్టయిన; న్థర వడ్డి రానియ
ట్లేవిధినైన మూలధన మేనియు నిల్పుకొనంగఁ బోలదే!

ఇంకను విన్ము నీగురుఁడె యీల్గినచో ననిఁ గృష్ణరాయలుఁ
గొంకక యప్పుడే కటకకుంభినిఁగొల్లగొనండె; యాతఁ డీ
వంకకు నేల సేనఁ గొని వచ్చును? నమ్ముము! సంధిసేయఁగా
నంకి లడేమి? తారకున కంతటియింద్రుఁడె లోఁగి యుండఁడే

మఱియు నుభయులు సంక్షిప్తోక్తులతో

'అవమతిసేయఁజూచినను బ్రాణములుండఁగనోర్తురెట్లు?' 'తా
నవమతి సేయు నేల తన కంతయు నిచ్చుచునంగ?' 'దుర్గముం
డు వనితలుంట జంకుదును, 'తుంటరియే యలకృష్ణరాయ' 'లే
మఫునొచుమా' 'భయంపడకుమాయుధమప్పుడెదీర్చునంతయున్'

ఇ ట్లిద్దఱు చర్చించినపిదపఁ దల్లితోఁ దన మంత్రియుద్యమమును
వీరభద్రుండు నుడువ "నాయుధంబుగల దవమానంబు రా"
దని చెప్పి యామెయు నొక్కింత తలయూఁచె నా మఱునాఁటి
వేఁకువ నక్కడ.

పలికెను దిమ్మమంత్రిఁ గని పార్థివుఁ డిట్టులు; పుట్టఁ ద్రవ్వి పెం
జిలువనుబోలె దుర్గము విశృంఖలతన్ బెకలించి శాత్రవుల్
వెలలిచి పెట్ట రాదె యిఁకఁ; బెంపరెఁ దొల్లిటిసారు గానరా
దలజడి కోర్వరామి నతఁ డాత్మహతిం దలపెట్టె నెగ్గగున్

ఆపలు కాలకించి సచివాగ్రణి యి ట్లనె నవ్వి; 'కృష్ణరా
యా! పృథివీశులం దిల దయార్ద్రిత నీ కెన లేమి నిక్క మా
భూపతి దారిపెట్టు మని పుచ్చెను దూతను దండ్రిప్రోలికిన్
రేపకడన్ జనంగను; భరించున దెన్ని దినంబు లింక నా

విని జాగేల తలంగిరి మ్మనును: వేవేఁ బంపుమా దూతలన్
ధనముం జేకొనరాదుగాని యితరద్రవ్యంబు లేమేనియుం
గొని పో నొప్పును; వారిగౌరవమునన్ గోరంతలోపంబు దా
రని రాకుండఁగఁ బంపఁగావలె సవారీ లిచ్చి దేవేరులన్

అనుటయుఁ బ్రాతఃకాలంబున.

ఆయుధపాణులై భటసహస్రము గొల్వఁగఁ దిమ్మమంత్రి వేఁ
బోయెను గొండవీటికిని, బొక్కసమంతయు నాపి వారికిన్
రాయలయానఁ జెప్పి యిఁక రం డని వచ్చెను వీరభద్రుఁడున్
దోయమువారిఁ గొంచుఁ దనతోఁ గలరాయనిజూచి, నాతఁడున్

కని వడి లేచి తా నెదురుగాఁ జని హస్తము పట్టి తెచ్చి యా
సన మిడి తిమ్మలం బిలుచు 'సాజము రాజకులంబునందటన్
ఘనబల మున్నవాఁడొరులఁ గాఁటియఁ బెట్టుటము న్న దెందుఁగో
చని, రిపు డీవు; నే నెపుడొ! శక్యమె దైవము దాఁట నేరికిన్

మది చింత దక్కు—", మన స
మ్మదమున నా వీరభద్రి మహీపతి వెడలెన్
బదిలముగ; నప్పరసు కృ
ష్ణదనుక సంపదము పట్టి జనపతి యానన్

ఘనుఁ డలకృష్ణరాయలకుఁ గైవస మయ్యెయుధాబ్దమందు నో
య్యన శకవత్సరంబు లిల నద్రిగుణశ్రుతిచంద్రసమ్మితిన్
దనర శుచీందుపక్షమున దర్సము నాహరివాసరంబుగా
నినసుతువారమందున మహీరమణీమణి కొండవీటిలో

ఇది శ్రీకావ్యతీర్థ బండుపల్లి మల్లయ్యశాస్త్రి
ప్రణీతం బగు కొండవీటివిజయం బను
ఖండకావ్యంబునందు సర్వంబు నేకాశ్వాసము
పరదేవతార్పితమస్తు సంతతశ్రీరస్తు.



అరేబియన్ నైట్సు కథలు (తెలుగు)

1,2,3,4, భాగములు ఒక్కొక్కటి 0—8—0

ఏకాక్షి (పరిశోధకనవల)

1,2 భాగములు ఒక్కొక్కటి 0—8—0

అచ్చులోనున్నవి.

రంగమహల్ 0—8—0

మతిమాలిన మరణశాసనము (పరిశోధకనవల)

1,2,3 భాగములు ఒక్కొక్కటి 0—8—0

సంసారము (సాంఘికనవల)

సుధాశరశ్చంద్రము కథతరువాయి

1,2 భాగములు ఒక్కొక్కటి 0—8—0

శ్రీకృష్ణా బుక్ డిపో,

రాజమండ్రి.

